సీ. బిగువుఁ జన్గవమీఁటువగ లెల్లఁ గనిపించు
నఱజాఱుఁబయ్యెద లంద మొందఁ
జెలువంపునెఱికకుచ్చెలలపైఁ బచ్చరా
మొగపుల యొడిదారములు వోసంగ
సన్నగేదఁగిరేకువన్నె చొప్పడు కీలు
జడలు పిఱుందుల సందడింపఁ
జెక్కుల డిగ్గఁబూసిన మేలిజవ్వాది
నిగ్గువాసన దిశ ల్నిండికొనఁగ
గిలుకు మట్టెలు మొరయంగఁ గులుకునడలు
జీనిబంగారు సురటులు పూని రోము
పాదు డగ్గఱ కేతెంచి పార్శ్వములను
నిలిచి యందఱు మ్రొక్కి వినీతి మెఱయ. ౧౦౮

గీ. పచ్చికస్తూరి బరిణలు దెచ్చి వేడ్కఁ
గానుకగ నిచ్చి పద్మరాగంపు మొగపుఁ
గడియములు గల్లుగల్లనఁ గరయుగములు
మొగిచి నిలిచిన నృపతి లేనగవు నిగుడ. ౧౦౯

ఉ. కామినులార యిప్పు డొకకార్యము గల్గిన దీర లేఁగి శో
భామహితాంగలీలల విభండకసూనుని లోనుజేసి యీ
భూమికిఁ దోడితేవలయుఁ బుణ్యుఁ డతం డిట మెట్టినంతనే
సీమకు సేమమౌ ననుచుఁ జెప్పెద రెల్లజను ల్నిజంబుగన్. ౧౧౦

సీ. మృగవిలోచనలార మీనిడువాల్జడల్
వాతాశిమహిమ నివారకములు
నలినాక్షులార మీనగుముద్దుమొగములు
ద్విజరాజధైర్యావధీరణంబు
లలివేణులార తేనెలు మించు మీవచో
మాధురి శుకమోహసాధకంబు
కామినీమణులార మీమందయానము
ల్పరమహంసభ్రమాపాదకములు

కమలముఖులార మీయుబ్బుగబ్బిగుబ్బ
చన్నులు గిరీశగౌరవోచ్చాటనంబు
లింతమహిమంబు గలుగు మీయంతవారి
కలమునీంద్రుని వలపించు టనఁగ నెంత. ౧౧౧

ఉ. నేలకు మింటికిం దొడరి నేర్పున సూత్రమువన్న, మందుఁ గుం
చాలనుగొల్వఁ ద్రాళ్లుసుకచాలునఁ బేనఁగఁజుక్కలెన్నఁ జ
ట్రాలనునారలొల్చి నెగడ న్వడగండ్లను గుళ్లుగట్టఁగాఁ
జాలినమీకు నిచ్చటికి సంయమిఁ దెచ్చుట యేమిచోద్యమో. ౧౧౨

ఉ. మచ్చికచేసి యె ట్లయిన మౌనిశిఖామణి ఋశ్యశృంగునిం
దెచ్చిన మీకు నందఱకుఁ దెప్పలుగా మణిభూషణంబులే
నిచ్చెద నంతమాత్రమె మహీ స్వహికైక్షైతునట్లుగా సభన్
మెచ్చెద వేగ నాపలుకు మేకొని పొం డట నిండువేడుకన్. ౧౧౩

చ. వినుఁ డల ఋశ్యశృంగముని వేదవిధిజ్ఞులలోనఁ బెద్ద నాఁ
జనునఁట బ్రహ్మచారియఁట సంతతముం బితృవహ్ని సేవసే
యునఁట తపోవనంబుననె యుండెడివాఁ డఁట మర్త్యులిట్టివా
రని యెఱుఁగంగనేరఁ డఁట యాయనఁ దేఁ దగునెన్నిభంగులన్.

వ. అనిన విని వారాంగన లెల్లం గలంగి యొండొరుల మొగంబులు గ
నుంగొనుచు నమ్మహీపతి కి ట్లనిరి. ౧౧౪

గీ. పుట్టుబ్రహ్మచారి పొలఁతులకూటమి
యెట్టిదో యెఱుంగఁ డట్టిమౌని
ఋశ్యశృంగు నిటకు నెట్లు దెచ్చెద మయ్య
మునులకోపములకు వనిత లెదురె. ౧౧౫

క. ఇంతుల నంపుదురె తప
స్స్వంతులకడ కెందునైన వారలు గన నా
క్రీంత మది నలిగి రేనియుఁ
జెంతల నెవ్వరికి నైనఁ జేరవ్వశమే. ౧౧౬

వ. అనిన రోమపాదుం డిట్లనియె. ౧౧౭

చ. మునుపు సురాధినాయకుఁడు మోహనలీలఁ జెలంగునప్సరోం
గనలనె పంపుఁబో మునినికాయము డగ్గఱకంచు మీరలు
న్వీనరె తలంక నేటికిది వింతయె కాంతల నిట్టిపట్లఁ బం
పిన సరసత్వ మింపెసఁగ మెచ్చుగఁ గార్యము లెల్లఁ జేకుఱున్.

క. అటుగను కిటునటు వలుకక
కుటిలాలకలార! మీరు గొబ్బునఁ జని యా
జటివరుని ఋశ్యశృంగుని
నిటకుం దోడ్తేరవలయు నెన్నివిధములన్. ౧౨౦

చ. అన విని యట్లకా కనుచు నవ్వెలయాండ్రును రోమపాదుచేఁ
గనకమయాంబరావలులు గైకొని సంతసమొప్పుచుండఁ గాఁ
జనిరి పదాంగదధ్వను లెసంగ మనంబుల నద్భుతంబు దా
ర్కొనఁ బురవీధిలో జనులు గుంపులు గూడుచుఁ దమ్ముఁ జూడఁగన్.

క. బంగరుపల్లకు లెక్కి మృ
దంగహుడుక్కాదికంబు లగువాద్యంబుల్
ముంగల మొరయఁగ నభినవ
శృంగారము మెఱయఁ జనిరి చెలువలు వేడ్కన్. ౧౨౨

వ. ఆసమయంబున. ౧౨౩

సీ. మనరాజు ఋశ్యశృంగునిఁ బిల్వ వేశ్యల
నంపుచున్నాఁడఁట యనెడివారు
హితులు మంత్రులుఁ బురోహితులు నుండఁగ వీరి
నంపంగఁ దగవాన యనెడివారు
నంగనలను జూడఁ డఁట వాఁడు వీరిమా
యలచేతఁ జిక్కునే యనెడి వారు
వెలయాండ్ర వెంటనే వలచివచ్చినయేని
యతఁ డేడతాపసి యనెడివారు
వాన రప్పింపఁ బురివిప్రవరులకంటె
నెక్కుడే వాఁడు దొరలకు నెల్లఁ దలఁప

దూరమున నున్నవారలె దొడ్డవార
లనెడి వారలు నై చూచి రపుడు జనులు. ౧౨౮

సీ. షడ్దర్శనీపరిశ్రమసమంచితబుద్ధి
వాసి గన్నట్టి విద్వాంసులకును
గర్ణామృతస్యంది కవితానిరూఢిచేఁ
బ్రౌఢిమించిన కవిరాజులకును
గాంధర్వసర్వస్వకళఁ గళంకము లేక
జాణలౌ జగజెట్టి గాణలకును
దత్తిలభరత మంతగాదిమతముల
వఱలెడినాట్యతత్త్వజ్ఞులకును
నిచ్చి యాకొల్వులంజల కీయఁ దగునె
పల్లకీలను హెచ్చుసంబళము బిరుదు
వాద్యములుఁ జూడ నృపులు సర్వజ్ఞులయ్యుఁ
దెలియలే రని కొండఱు పలికి రపుడు. ౧౨౯

వ. ఇట్లు పౌరు లెల్లఁ గనుంగొన రాజునానతిం గైకొని పైనంపు సొంపు
లం గదలి రాజమార్గంబు గడచి చనుచుండ నయ్యవసరంబున.

సీ. కమ్మబాగాలును గత్తెఱ తెలనాకుఁ
గవిలెలు బలువన్నెగందవొడులుఁ
గపురంపుగిన్నెలుఁ గస్తురివీణెలుఁ
బన్నీటిచెంబులుఁ బసిఁడియంచు
రవికెలు జీనిసురటులు దంతపుదువ్వె
నలుఁ బట్టుకుచ్చుకుచ్చెలలకట్లుఁ
జికిలియద్దములు మంజిటికావ్రబరణులు
మంజిడిచేలలు మఱియుఁ గలుగు
వస్తువులుదెచ్చి యేమును వత్తు మిచట
నుండనోప మటంచు నొండొండ సొలసి
పలుకు విటులను జేరంగఁ బిలిచి వారిఁ
గొంతదూరంబు గైదండ గొనుచు నరిగి. ౧౩౦

క. పుటభేదననికటస్థలి
నట నొకచో బహుళభూరుహచ్ఛాయ సను
త్కట మగు నుపవనమున నొ
క్కట యించుక సేపు నిలిచి కూర్చినటింపన్. ౧౨౮

చ. ఇటునటు మోము ద్రిప్పి వెడ యేడ్పులు దెచ్చుచుఁ గన్నుఁగోనలం
బొటపొటరాలునశ్రుకణము ల్వ్రేనగోళ్ళను మాటిమాటికిం
జిటుకుచిటుక్కునం జెదరఁ జిమ్ముచు గద్గదికం దొలంకు ము
చ్చటపలుకు ల్చెలంగ బిగిచన్నవసోఁకఁగఁ గౌఁగిలించుచున్. ౧౨౯

సీ. రాజునానతి మీఱరాదు గావున మాకు
నీవేళఁ బైనమై పోవవలసెఁ
బోయిన నేమి గొబ్బున వచ్చెదము మిమ్ము
నొకపూఁట చూడక యుండఁగలమె
మునిఁ దోడుకొని వచ్చు పని గాన యరయంగఁ
బదినాళ్ళు పట్టెఁ బట్టు నచట
నేము పోయినకార్య మీడేఱ దేవళ్ళ
కును మ్రొక్కుకొనుఁడు మాకొఱకు మీరు
వగలఁ బొగులంగ వలదు రేవగలు మాను
మనసులోనన యున్నార లనుచు వారి
మగుడఁ బురమున కనిచి యమ్మగువలంత
మన్మథాసులఁ బ్రార్థింప మదిఁ దలంచి. ౧౩౦

సీ. ఒంటిగాకుండ మావెంటనే నడవుమీ
సుమచాప చాపబాణములు పూని
వనమార్గములను గావలి గాఁగ నిలువుమీ
సంతతంబు వసంత సంతసమునఁ
బవనమా ప్రాణంబుప్రాణమై యుండుమీ
హాయన మది నెడఁబాయ కెపుడు
వడఁ దాఁకకుండ మాకడనె చరించుమీ
చంద్ర వెన్నెలతేట చల్లికొనుచు

మేకములను గూడి వేడుక మెలఁగుచుండు
ఋశ్యశృంగుని బట్టఁబోయెదము కడఁగి
యనుచు మన్మథ మధు మరు దమృతకరులఁ
బ్రార్థనలు చేసి యవ్వలఁ బయనగతుల. ౧౩౧

చ. చనిరి విభండకాశ్రమముచాయనె పోయెడి త్రోవ గాంచి య
వ్వనజవిలోచన ల్బిరుదవాద్యనినాదము పార్శ్వసీమలం
ఘనవనకుంజగర్భములఁ గ్రమ్మి గుబుల్కొనుచుండ నవ్యకాం
చనశిబికాధిరూఢలయి చక్కనిచెల్వలు వెంటఁ గొల్వఁగన్. ౧౩౨

వ. ఇత్తెఱంగున నవ్వారాంగనలు కనకపల్యంకికారూఢలై యిరుగేలం కులం బొంకం బగు కుంకుమవన్నెగాలి తెరచీరలు దిగుపాఱకుండం బట్టు పన్నాగంబులమీఁదఁ బన్నుగా నెత్తి కట్టించి కట్టాణిముత్తియంపు గుత్తంపుఁ గమ్మపంజులయంచులం దుళకించు వజ్రపుఁదళుకుల జిగిబెళకులంగలసి మాటికిం దేటమిటారి తెలిచూపుఁగోపులు క్రేళ్లు దాఁట నిట్టట్టు గనుంగొనుచుఁ గదంబంపు మేపూఁతలపరిమళంబుల డంబు లతిదూరంబులుగాఁ బేరెంబులు వాఱ సారెకుం దెలిసాలెజిలుఁగుఁ బయ్యెదలు గదల సురటులు గొని విసరుకొనుచు వడ దాఁకకుండ నెడనెడం బన్నీరు చిలికిన చేపావడల మొగంబులు దుడిచికొనుచు నుడిగంపుఁ జేడియలచేతి నిద్దంపుటద్దంపుబిల్లలు గొని యప్పటప్పటికి సింగారంబులు చెదరకుండం జూచికొనుచుఁ గుసుమిత లతాకుంజపుంజగుంజన్మధురమధుప ఝుంకారధారాపూరితంబు లగువనాంతరాళంబులఁ దఱిసి యొక్క దిక్కున ననోకహానిష్కుహకుహరంబుల నొక్కట గుబ్బిలు నిజరతికూజితానుకారి పారావతారావంబులు వినుచు నొక్కచక్కిఁ జక్కని కేకినాట్యంబు లవలోకించుచు నొక్కచోట నొక్కటొక్కటి ఱెక్కలం గప్పుచు మిక్కుటంపు మక్కువం జొక్కు చక్రవాకదంపతులసొంపు దర్శింపుచు నొక్కచాయఁ బాయక గుత్తంపుఁ బూగుత్తులు హత్తికొనం బున్నాగంబులం బెనంగొన్న కన్నెతీఁగియల బాగులు విమర్శించుచు నొండొక్కయెడం

బోడవుగా వివిధతాళంబు లుగ్గడించుచు గట్టువానట్టువ లనంజూపట్టు భరతంపుఁ బిట్టలకట్టళ్లు మెచ్చుచు వేఱొక్కసరసఁ గిసలయగ్రాస కషాయకంఠకలకంఠగానంబు లాలకించుచుఁ దటరుహతరుభ్రంశి కుసుమవాసనావిశేషంబులం బాటిల్లు నేటికాలువలదండ నొండొండ కమ్మని చలిదివంటకంబులు భుజించుచుఁ దేటతెలినీరు గ్రోలుచుఁ గొలంకుల కెలంకుల నింపుదొలంకు సంకులకలహంస సారస క్రేంకారసారస్యంబులు మెచ్చుచు నందంద మందగంధవహకిశోరంబులు శ్రమంబు లాఱంజేయుచుండం జని చని యవ్విభండకమహర్షి యాశ్రమంబున కనతిదూరంబున నొక్కయెడం బల్లకు లునిచి పాదచారంబున నరిగి యంత. ౧౩౩

సీ. యాయజూకనికాయహూయమాన నవీన
సాన్నాయ్యసౌరభ్యసంభృతంబు
పర్ణశాలాభ్యర్ణ భాగసౌఖ్యనిషణ్ణ
రోమంథచలదోష్ఠరోహితంబు
శాఖాగ్రలగ్న కాషాయవల్కలకాంతి
నిత్యపల్లవితావనీరుహంబు
హోమధూమస్తోమ జీమూతమాలికా
లోకనోత్సవనటత్కేకిగణము
సకలనిగమ పదక్రమోచ్చారణజ్ఞ
శుకకృతాచార్య విశ్రాంతి సుఖమునైన
యలవిభండకమౌనీంద్రునాశ్రమంబుఁ
గనుఁగొనిరి వేడ్క నవ్వారవనిత లపుడు. ౧౩౪

సీ. ఉదయాద్రిపై దృష్టి యునిచి యామధ్యాహ్న
ముడుగక చూచుచు నుండువారుఁ
గళదఘ్నజలములోపలనె యాసాయంబు
వడఁకక మంత్రము లొనుదువువారు
బయలను వాన యెండయనాక స్థాణువు
ల్వలె నుండి ధ్యానంబు సలుపువారు

ఫలపర్ణములు చెంతఁ బడిన భక్షించుచు
నజగరవృత్తిమై నలరువారు
ఘనజటావల్లికల గిజిగాండ్లు గూండ్లు
లిడఁగ లయయోగనిష్ఠులై యెసఁగువారు
నగుచుఁ దపములు సేయు మహర్షివరులఁ
జూచి యాయబ్జలోచన ల్చోద్యపడుచు. ౧౩౫

క. ఇది సకలపుణ్యసదనం
బిదెపో యలబ్రహ్మలోక మెంచఁగ ననుచున్
మదివెఱఁ గందఁగ నెంతే
మదవతు లయ్యాశ్రమంబు మహిమలు గనుచున్. ౧౩౬

వ. అయ్యాశ్రమంబుఁ బ్రవేశించి యొండొరులతోడ. ౧౩౭

క. నకనకఁ గౌనులు బెళకఁగ
సికతాకలశములఁ జలువచెలువొందఁగఁ జె
ట్లకు నీళ్లు వోయుమునిక
న్యకలప్రభావంబు గంటె నలినదళాక్షీ. ౧౩౮

క. బంగారు వెండి గొలుసుల
భంగింగంఠములఁ గోడెపాములు పెనఁగన్
ముంగిసలు పర్ణశాలల
ముంగిళ్లం బరువులిడుముద్దులు గంటే. ౧౩౯

గీ. మక్కువ చెలంగఁ దమలేఁగ లొక్కప్రక్కఁ
బులికొదమ లొక్కప్రక్కను బొదుఁగుదూఁటి
చన్గుడువ నబ్బు లిటునటు సాచిసారె
వాని మైనాకుచుండు గోవ్రజముఁగంటె. ౧౪౦

సీ. ముదితాపసులచేతి యుదకుండికలు తొండ
ములఁ దెచ్చుగజపోతములను గంటె
వలచుట్టికొనుచు నివ్వరిమెందుగలకుఁగా
వలియుండు జింకపిల్లలను గంటె

వృక్షంబు కొమ్మల వ్రేలెడు జపమాలి
కలు మౌనులకు నిచ్చ కపులఁ గంటె
రువ్విచ్చు మునికుమారుల వేదపాఠంబు
లకుఁ దప్పు దిద్దు శారికలఁ గంటె
హోమవేళ లెఱుంగుచుఁ దామె వచ్చి
కుండ లటువెట్ట నిండఁ బాల్గురిసి మిగిడి
పొలములకుఁ బోవు గోగణంబులను గంటె
యిందు మహిమంబు లేమన నిందువదన. ౧౪౧

వ. అని యయ్యాశ్రమంబు మహిమంబులు వొగడుచు నాచెంత నతికాంతంబును గుసుమితలతాక్రాంతంబును నగు నొక్క యేకాంతవనాంతంబున నిలిచి ఋశ్యశృంగునిం గనుంగొంద మనుచు నలుదిక్కులుఁ జూచుచుండ. ౧౪౨

క. ఆఋశ్యశృంగమౌనియు
మూరెఁడుగడ్డంబు నెత్తి మొలచిన కొమ్ముం
జాఱలమెకంబుతోలు వి
కారము దెలుపంగ నెదురుగాఁ గనిపించెన్. ౧౪౩

వ. కనిపించిన నయ్యంగనలు మందహాసకందళితకపోల లగుచు నందఱుం దమలోన. ౧౪౪

సీ. కొమ్మకో నడునెత్తిఁ గొమ్మొంది యాచుట్టు
జడలు చెంపల వ్రేలఁబడుట యొంది
మెడచుట్టుఁ జిల్లులచిడిపిరాల్గూర్చిన
తీరునఁ బూసలపేరు లేంది
బుసి గప్పుకొన్న చొప్పున మేన నిండంగ
మేదించినట్టి యీబూది యేంది
కసవుముప్పిరిత్రాటఁ బొసఁగంగఁ గట్టిన
పొడచింకతోలు కచ్చడ మదేంది
నొసల పసిబొట్టి దేంది యెదెసల నిట్టి
బూచిఁ గనుఁగొన మక్కు చూచినపుడె

వెఱపడరె యంచుఁ జేతొమ్ము చఱచికొనుచుఁ
గడఁగి డగ్గఱఁ జేరక కడనె యుండి. ౧౪౫

క. ఇమ్మానిసిమెకము న్నది
నమ్మఁ దగదు చేర గొబ్బునం జనకుఁడు పైఁ
గ్రమ్మి తల వంచికొని వడిఁ
గొమ్మున నటు చిమ్మెనేని కొద వగుఁజుండీ. ౧౪౬

గీ. తరుణిరో వీని శుద్ధదంతముల మీఁద
లీలఁ దాంబూలరస మింత గీలుకొనినఁ
బండి పగిలిన దాడిమీఫలములోని
విత్తు లన నుండు నెఱుఁగుండు వీడియంబు. ౧౪౭

సీ. ఈపట్టవర్ధనం బేటికి నుదుటికిఁ
దీరుగాఁ గస్తూరి దిద్దరాదె
యీదర్భలపవిత్ర మేటికి వ్రేలికి
విడికెంపుటుంగరా లిడఁగరాదె
యీపొడచింకతో లేటికి మేనికి
వీణాము వలెవాటు వేయరాదె
యీతులసీభూష లేటికిఁ జెవులకుఁ
గట్టాణియొంటులు వెట్టరాదె
కొమ్ముమొలచినయంతనె కొదవ యేల
వచ్చు నితఁ డేమి చక్కనివాఁడు గాఁడె
యది కిరీటంబులోపల నణఁపరాదె
యంచుఁ బలికిరి మునిపుత్రుఁ గాంచి వేడ్క. ౧౪౮

గీ. ఘనుఁడె యితఁ డేమి యుందఱకన్న వేఱ
కొమ్ము మొలచెనె యని యాడికొందు రెందుఁ
గొమ్ము మొలచిన దితనికిఁ గొమ్మలార
మునిశిరోమణి యితఁడెపో ముజ్జగముల. ౧౪౯

గీ. చెలియరో వీఁడు నా చేతఁ జిక్కెనేని
కళలఁ జొక్కించి సుఖనిద్ర గ్రమ్మఁజేసి

గురుసు దగులకయుండంగఁ గొమ్ము దివిచి
మంచి కస్తూరిబరణి వట్టించవచ్చు. ౧౫౦

గీ. ఇతఁడు వనములలోఁ జరియించుకతన
నెత్తి వసి నాటినదొ లేక నిక్కముగను
గొమ్ము మొలచినదో యిటు కొమ్మలార
మునులలో నీవికారంబు గనము వినము. ౧౫౧

గీ. కొమ్మె కనిపించుఁగాని మొకమ్మునకును
బొమ్మపైఁ బసు గడ్డంబు రోఁత లేదు
మొలఁతరో వీఁడు మానిసిమొకము చూడ
వీని నెలయింపవచ్చునే లోనుసేసి. ౧౫౨

సీ. తెలిగందవొడియు మంత్రించి మైనటు చల్లి
వెంటరా మరపెద వీనిఁ గొమ్మ
మొలనూలు దిగిచి కొమ్మున నుచ్చు దగిలించి
చేపట్టి కొనితెత్తుఁ జిగురుఁబోఁడి
గానంబుచేతఁ జొక్కగఁజేసి యిట్టట్టుఁ
జనకుండఁ జేసెద వనజగంధి
ఫలములందునె మేఁత వలనొప్పఁగాఁ గూర్చి
భ్రమనొందఁ జేసెద భ్రమరవేణి
యనుచు నీరీతిఁ బాతంబు లాడికొనుచు
నొకట నందఱుఁ గస్తురిమొకములట్టు
లంగనలు మేలితావు లుప్పొంగుచుండఁ
జేరఁ జనుదెంచి యాఋశ్యశృంగుకడకు. ౧౫౩

సీ. ఒకకొమ్మె కనిపించుమొకము మానియటంచుఁ
బొదలలోఁ జని మోసపోయి పోయి
మానిఁ గాంచియుఁ జెట్టుమాటుకొమ్మెఱుఁగక
యితఁడు వేఁజొకఁ డంచు నెంచి యెంచి
యాటకై ఋషిపుత్రు లతనివేషము పూని
తిరుగ వారలవెంటఁ దిరిగి తిరిగి

కని యొంటికొమ్ముమెకము మెకమ్ములలోన
మైఁ గాంచి కాదని మరలి మరలి
మాటికిని ముందుచూచినచోటె చూచి
కులుకుగుబ్బెత లోకరీతి గుఱుతుపట్టి
చేరి యీతండెపో ఋశ్యశృంగుఁ డనుచు
నలరి తమలోన నిట్లని తలఁచి రంత. ౧౫౪

సీ. వలలుగా మనకొప్పువలలు నల్లడఁ దీర్చి
తగిలించుకొనవచ్చుఁ దరుణులార
గంటలసరిపెణ గంటవేఁటలు పన్ని
పట్టుకొనఁగవచ్చుఁ బడఁతులార
వలకారి జిలుగుదువ్వలువలఁ దెరవారి
చిక్కించుకొనవచ్చుఁ జెలువలార
మేలనూలియురులు కొమ్మునఁ దగుల్లొనఁ జేసి
కొనిపోవఁగావచ్చు వనితలార
యివియుఁ దానేల మనచూపు లెనయ వేఁట
యిట్టి వెనువెంటఁ జనుదెంచు నిట్టికరణి
వచ్చు మచ్చికవచ్చిక నిచ్చఁదగిలి
మునిమృగము వేడుకలు మీఱ ముదితలార. ౧౫౫

వ. అని చేరం జనుదెంచిన వనితలం గనుంగొని ఋశ్యశృంగుండు.

సీ. అబ్బురంబుగ నెవ గుబ్బకొమ్ములు మొల్చె
ఘనులు వీరార నాకన్న ననుచుఁ
బదములఁ బొడమెడుఁ బద్మము లీవిరల
మహిమ యెంతటివింత మహినటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
దాకర్షణము వీరి కబ్బె ననుచుఁ
బలుకుల నమృతంబు దొలఁకెడు బళి వీర
లమృతాంధసులకన్న నధికు లనుచుఁ

గాన మెన్నఁడు నీసామగానగరిమఁ
గఠినపాషాణముల నీరుగాఁ గరంచె
నంచు మది నెంచి పలుమఱు నరుగుపనుమఁ
గొమ్మకొన యూఁగఁ దల యూఁచికొనుచుఁ జేరె. ౧౫౭

సీ. కులుకుగుబ్బెతలచూపులు గల్వవిరులంచు
దేవతార్చనకుఁ గాఁ దివియఁబూను
మగువ లందును నవ్వ నగవువెన్నెలలోన
విరవాఁకజల మంచు మునుఁగఁబోవు
వల దని కేలాఁచువారి పచ్చలకడి
యాలనిగ్గులు దర్భ లనుచు డాయు
నది గని తెప్ప వేయక చూచుకొమ్మల
ననిమిషు లనిమ్రొక్కి నగ్గలించు
నపుడు తనకొమ్ము కనుదాఁకు నంచు నెంచి
వెనుకకై పోవ వారలఁ గనుచుఁ జేరె
యకట నామీఁద దయ లేదె యనుచుఁ బలుకు
నౌర యీరీతి నమ్ముగ్ధపారికాంక్షి. ౧౫౮

సీ. చెలువలు పన్నీరుచెంబు లిచ్చినఁ గాశి
కుప్పెలజల మంచుఁ గ్రోలనెంచు
సతులు జవ్వాది యొసఁగ గోపిచందన
మని ఫాలమునఁ దీర్చ నగ్గలించుఁ
గాంతలు మరువంపుఁగాను కిచ్చినఁ దుల
సీదళం బనుచు భక్షింపఁ జూచుఁ
బొలఁతులు వెలిగందనోడి యిచ్చిన విభూతి
యిది యటంచుఁ ద్రిపుండ్ర మిడఁ దలంచు
నలరుఁబోఁడులు వజ్రాలహార మొసఁగఁ
బటికపు జపాక్షసర మంచుఁ బాణిఁ బూని

మాని జపియింపఁ దివుర నెందైనఁ గలరు
ముగ్ధ లగువార లటువంటి ముగ్ధ గలఁడె. ౧౫౯

వ. తదనంతరంబ. ౧౬౦

ఉ. మ్రొక్కి కరాబ్జము ల్మొగిచి ముందఱ నిల్చి మునీంద్రులార మీ
రెక్కడనుండి వచ్చితిరి యిచ్చటి యాశ్రమభూము లెన్నఁడుం
ద్రొక్కఁగఁ జూడ మిట్టిశుభరూపము గన్గొన నెమ్మనంబున
న్మిక్కిలి వేడ్కయయ్యె నని మెచ్చుచు వారలఁ జేరి యల్లనన్. ౧౬౧

సీ. హోమకుండికలట్టు లెద మోచికొన్నార
లని కుచంబులు కేల నంటి యంటి
యీతెల్లరుద్రాక్ష లేడఁ గల్గె నటంచు
హారము ల్పలుమాఱు నలమి యలమి
మంచివి కటిబద్ధమౌంజీగుణము లంచు
మొలనూళ్లు సారెకు ముట్టి ముట్టి
సూక్ష్మవల్కలము లెచ్చోటఁ దెచ్చితి రంచుఁ
బసిఁడంచుచేలలు పట్టి పట్టి
హోమరక్షలఁ బరిమళం బున్న దనుచు
మేలికస్తూరితిలకము ల్వాలసీమ
మోము దార్కొన మూర్కొని మునికుమారుఁ
డిట్లు భ్రమయంగ నంగన లెల్లఁ జూచి. ౧౬౨

గీ. నేఁడు మనచేతఁ జిక్కెఁబో వీఁ డటంచుఁ
బాదములగెల్పుబిరుదులు పదిలముగను
గట్టుఁ డీఁక నంచుఁ జంకలు దట్టికొనుచు
నొండొరులఁ జూచి చిఱునవ్వు లుల్లసిల్ల. ౧౬౩

గీ. ఇంతచాలు నేఁటి కిటమీఁద మిక్కిలి
రేఁపునడిమెనేని రేపు రాఁడు
మచ్చు చల్లినట్లు మరిగి యిచ్చోటికె
వచ్చుఁ బోఁడు వీఁడు వనితలార. ౧౬౪

క. చండకరతేజుఁ డైన వి
భండకముని యెఱిఁగెనేని పటుకోపకళం
జెండకమానం డిచ్చో
నుండక యటు దొలఁగవలయు నో చెలులారా! ౧౬౫

వ. అని యిట్లు మతకంబు లాడికొనుచు ఋశ్యశృంగుం గనుంగొని.

గీ. వ్రతము సలుపంగఁ బోవఁగావలయు మాకు
వేగ నీవును హోమాదివిధులు దీర్పఁ
బొమ్ము నేఁటికి మీావనంబునకె మగిడి
యెల్లి వచ్చెద మిచటి కో ఋషికుమార. ౧౬౬

క. అని ఋశ్యశృంగమునిఁ దన
వనమునకుం బోవనిచ్చి వారవధూటుల్
చని తారుండిన మునుపటి
ననఁబొన్నలలోన నిలిచి నగవులు నిగుడన్. ౧౬౭

క. ఈపొదరిండ్ల సొంపులు
నీపువ్వుల తావిలేని యే మనవచ్చున్
బాపురె యెట్టైన నమ్ముని
రే పిచటికిఁ దెచ్చి యుపచరింపఁగవలయున్. ౧౬౮

వ. అని యిట్లు కోరుకులు మీఱం బలుకుచు నవ్వనజనేత్ర లారాత్రి
యవ్వనంబులో నిద్రించి మేలుకని మఱునాఁడు రేపకడయ సంధ్యా
దికృత్యంబులు నిర్వర్తించి చనుదెంచిన మునికుమారుం గనుంగొని
యొయ్యనొయ్యన నొయ్యారంబులు మెఱయ డగ్గఱ కరిగి యేమి
యు ననక కొంతతడవు నిలిచి రంత ఋశ్యశృంగుండును నయ్యంగన
లం గనుంగొని కరంబులు మొగిచి యోఋషులార మీరలు మా
యాశ్రమంబునకు వచ్చి మాసేయు నుపచారంబులు గైకొనిపోవల
యు నని ప్రార్థించి వారలం దోడ్కొని తనతపోవనంబునకుం జని యచ్చ
టం బర్ణశాలాంగణంబున రసాలసాలంబుల నీడ నందఱకు నందంబు
గా దర్భాసనంబులు వైచి కూర్చుండ నియమించి నమస్కరించి. ౧౬౯

క. ఇదె యర్ఘ్యం బిదె పాద్యం
బిదె కుసుమఫలోపహార మిదె కొమ్మని స
మ్మద మొదవ ఋశ్యశృంగుఁడు
మదవతులకుఁ బూజ లొగి సమర్పణ సేసెన్. ౧౭౦

గీ. పూజ గైకొని వేడ్క నంభోజముఖులు
కంటిరే నేఁడు నిన్నటికంటె వెఱ్ఱి
మిగులఁ గనిపించె ననుచు లేనగవు లలర
నొయ్య దగ్గఱ కటుచేరి నెయ్య మొనర. ౧౭౧

సీ. కుందకందుకములచందానఁ జంద్రఖం
డములట్లు ఫేనషండములచాయఁ
బాండురచ్ఛాయలు పరిఢవిల్లుచునుండఁ
దెలిచక్కెరలును వెన్నలును గూర్చి
సాజ్జెలవగల మెచ్చులు పుట్టఁ జేసిన
కజ్జము ల్వొన్ని కైకాన్క లిచ్చి
మునినాథ మావనంబులపండు లివి కొన్ని
చవిచూడు మనినఁ గేల్సాఁచి యంది
త్రుంచి భక్షించుచునె కొమ్ముతుద యొకింత
గదలఁ దలయూఁచి సంకులకరణి ధవళ
దంతములు గానుపింపంగ సంతసంబు
చెలఁగ మొగమెత్తి నవ్వుచుఁ జెలులఁ జూచి. ౧౭౨

క. ఇవి మీవనతరుఫలములె
చవి యే మనవచ్చు నమృతసంభవులో యీ
భువి నెన్నఁడుఁ గనుఁగొన మా
దివి నైనం గలవె యిట్టి తీయని ఫలముల్. ౧౭3

గీ. ఎంతదూరంబు మీవన మిచటి కనిన
దూర మేడది గడియెఁడుత్రోవ యింతె
వనము గనుఁగొని పండ్లు దేవచ్చు నోడలు
గదలకుండంగఁ దోడుక పోయెదము నిన్ను. ౧౭౪

యొండొరుల రొండిఁ జెక్కి పసిండి సరిగ
చేల పన్నాగముగ వైచి లీల మెఱయ. ౧౭౮

క. అందలము రీతి నందఱు
నందంబుగఁ గూడికొనుచు నందు మునీంద్రుం
బొందుగ నిడికొని పదరక
మందగతులఁ మెఱయ హరిమార్గమునం జనన్. ౧౭౯

గీ. సాగి నడచిరి వికచాంబుజాతముఖులు
యోగివరు ఋశ్యశృంగుని నొకటఁ బొదివి
భోగిఁ జేపట్టుకొని పోవుబాగు మెఱయ
వేగిరము యంగవిభునకు వేడ్క సేయ. ౧౮౦

గీ. బటువుబిగిగుబ్బబటువులపై నొకింత
యొఱగి యొరగింతయును లేక యొప్పుచుండు
వనజనయనాభుజాందోళికను వసించి
తేజరిలె నప్పు డమ్మునిరాజు మిగుల. ౧౮౧

చ. వనజవిలోచన ల్మెఱుఁగువాలికచూపులు ద్రెళ్లుదాఁట న
మ్మునిసుతు సారె గన్గొనుచు ముద్దులవేడుకచింక చిక్కెఁబో
యనుచు లసద్విలాసపరిహాసవచఃక్రమముల్ సెలంగఁగాఁ
జని రట సాగి యంగనృపచంద్రునిపట్టణపద్ధతిం దగన్. ౧౮౨

సీ. అడుగు జాఱకయుండ నడవుమీ యిచ్చోటఁ
బూఁదేనె జీరుకు పువ్వుఁబోఁడి
మెలమావి బలుకొమ్మ లిచట నడ్డము వచ్చె
నటపోయి తిరుగు మోయంబుజాక్షి
కనుచూపు మెఱయ నిక్కడ రాజనపువంక
యిరుమేల యొద్దిక సరసిజాక్షి
సంగడఁబులు గూడి చనుఁ డిందుముఖులార
కెందమ్మికొలఁకుల సందుత్రోవ
కలిగెఁ జిన్నారిమోపు బంగారుమోపు
బాపురే యంచు మేలంపుఁ బలుకు లలర

నొండొరుల నెచ్చరించుచు నింపునేర్పడఁ
గూడి నడచిరి మునిపుత్రుఁ దోడికొనుచు. ౧౮౩

క. కై లాగు తడుగు దిగుదల
మే లుప్పర మింక జతన మే ల్బళి యనుచు
న్నేలము లాముచుఁ జని ర
బ్బాలామణు లంగవిభునిపట్టణమునకుఁ. ౧౮౪

వ. ఇత్తెఱంగునవారాంగనలు ఋశ్యశృంగమునిపుంగవుం దోడ్కొని యం
గరాజరాజధానిం బ్రవేశించి రక్షణంబ జనులెల్ల నీక్షించుచుండ
నద్భుతంబుగ. ౧౮౫

సీ. చిమ్మచీఁకటులు హెచ్చిలఁ గాఱుక్రమ్ముచు
మేఘంబు లొయ్యన మిన్నుప్రాఁకె
మేఘజాలమునందు మిహిపైఁడితీఁగల
కరణిఁ గోలమెఱుంగులు మెఱసె
మెఱపులతోడనె తెఱచుగా నుఱుములు
ఘుమఘుమధ్వనుల దిక్కులఁ జెలంగె
నుఱుములతోఁ గూడ నొకట ధారాళమై
వాన ధారుణిఁ జలువానఁ గురిసె
దేవదుందుభినాదంబు దివ్యపుష్ప
వృష్టియుఁ బొసంగ జగము సంతుష్టి నొంద
ఋశ్యశృంగమునీంద్రుఁ డింపెసకమెసఁగ
నంగవిభుపట్టణము చేరినంతలోన. ౧౮౬

క. నిండుమదితోడఁ గూడి వి
భండకతనయుండు రోమపాదునిపురిలో
రెండమగు లిడినమాత్రన
కుండలు గొని వంచినట్లు గురిసెఁ ఘనముల్. ౧౮౭

సీ. అంగరాజును ఋశ్యశృంగుని కెదురేఁగి
భయభక్తివినయసంభ్రమము లలర

సాష్టాంగ మెఱఁగి యర్ఘ్యముఁ బాద్యము నొసంగి
తననగరికిఁ దోడుకొనుచు వచ్చి
యంతఃపురంబున హైమపీఠిక నుంచి
పుష్పాక్షతంబులఁ బూజచేసి
మనసునఁ గోపంబు గనకుండునట్లుగా
నమ్మహాత్ముని ప్రసాదమ్ము గాంచి
శుభముహూర్తంబునందును విభవమెసఁగఁ
దనకుమారిక శాంత నమ్మునికి నొసఁగె
శాంతయును దాను నిప్పు డాసంయమీంద్రుఁ
డంగవిభునింట నున్నాఁడు హర్ష మెసఁగ. ౧౮౮

వ. అని యివ్విధంబున దశరథమహీనవునకు సుమంత్రుండు ఋశ్యశృంగునికథ సవిస్తరంబుగా వినిపించెఁ దదనంతరకథాసంవిధానం బెట్టి దనిన. ౧౮౯

శా. ప్రస్తైమప్రకటప్రతాపతపనప్రౌఢోష్మశుష్యన్నిశా
టస్తోమోచ్ఛలద్బాహుజవ్రజ ప్రచండస్థాణుకోదండవి
ధ్వస్తిధ్వానఘనానకస్వనసముద్దామక్షమాకన్యకా
హస్తీకృత్యభివర్ధితోదయ దయోదంచద్దృగంభోరుహా. ౧౯౦

క. కర్కశకలహాసముద్భట
మర్కటభటబంధితాబ్ధిమధ్యపథశుభో
దర్కకరదివ్యగుణగణ
యర్కకులాభరణ ఘననిజాంగస్ఫురణా. ౧౯౧

పంచచామరము:—

సురస్ఫురత్కిరీటకోటిశోభితాంఘ్రిపంకజా
శరాసభృత్కరా శరాగ్రజర్జరీకృతాశరా
మరుత్సరిచ్ఛరద్ఘనస్మరద్విషత్సితచ్ఛద
స్వరీశ్వరద్విపచ్ఛవిచ్ఛటానటద్యశోఘనా. ౧౯౨

గద్యము. ఇది శ్రీరామచంద్ర సాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేషనిరర్గళవాగ్వైభవాశేష సరససాహిత్య కళాభోజ, సత్యసంభూషితముఖాంభోజ, సకలసామ్రాజ్యధారేయ, నిత్యవితీర్ణిధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషితపంచాశత్సహస్రభూసుర, బహువారావర్తితమహాదానవైభవానర్తితకీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్రబహుళాగ్రహారభూషితచోళధరామండల, నిఖిలభోగవిభవనిర్జితాఖండల, సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాలభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీరంగ విజయరాఘవపుర కుంభఘోణాదిదివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రానిర్జితసముద్ర, సదాశ్రితభరణదీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజసన్నుతాసాధారణశౌర్య, దిగంతప్రసిద్ధతరౌదార్య, సుజ్ఞానజనక, సతతసంసేవితజనక, పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంతవిమోచనశ్లాఘనీయ బాహుబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితసుమసాయక, సకలధర్మసంధాయక రఘునాథనాయకప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున విబుధజనవినుతవివిధకథాశాఖాప్రకాండంబగు బాలకాండంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# రఘునాథ రామాయణము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీకౌసల్యానందన
కాకుత్స్థకులాబ్ధిచంద్ర కరుణాసాంద్రా
లోక మునిలోకహృదయవ
శీకరణగుణాభిరామ శ్రీరఘురామా. ౧

వ. అవధరింపు మట్లు సుమంత్రుండు ఋశ్యశృంగునికథ చెప్పి మఱియు నద్దశరథమహీధవునితో నిట్లనియె. ౨

సీ. నరనాథ వినుము సనత్కుమారుఁడు వెండి
యాకథాంశమునందు యిట్లు లనియె
నిక్ష్వాకుకులమున నిద్ధచారిత్రుండు
దశరథుం డన మహీధవుఁడు పుట్టు
శాంత యన్నన్యక జనియించు నతనికి
నంగాధిపతితోఁ బొసంగు జెలిమి
యంగాధిపతికడ కతఁ డేఁగి ధరణీశ
నాకు నిప్పటికి నందనులు లేరు
ఋశ్యశృంగుని బనుపు మాఋషివరుండు
గడఁగి పుత్త్రేష్టి గావింపఁ గలరు సుతులు
ననుఁ గృతార్థునిఁ జేయు మెంతయును గరుణ
ననుచుఁ బ్రియ మొప్పఁగాఁ బల్కు వినయమొనయ. 3

వ. అనిన నంగరాజగు రోమపాదుండును దనయల్లుం డగు ఋశ్యశృంగ మునిపుంగవు శాంతతోడంగూడ నమ్మహీధవుని వెంట నంపు ఋశ్య శృంగుండునుం బుత్త్రకామేష్టి సేయించు నతని మంత్రమహిమంబున నద్దశరథమహీధవునకు నలుగురు కుమారులు గలుగుదు రని సనత్కు

మీరుండు తొల్లి ఋషులసన్నిధిం బలికె నిది నిస్సంశయం బోమ
హీపాల నీవ సకలబలసన్నాహంబు చెలంగ నంగరాజు డగ్గఱి కరిగి
ఋశ్యశృంగు నడిగి తోడ్కొని రమ్మనిన విని సుమంత్రుని వచనం
బున కలరి యమ్మహీకాంతుండు సంతసంబున నంతయుం దనగురుం
డగు వసిష్ఠమహర్షి వరునకు విన్నవించి యతని యనుమతి వడసి శుభ
ముహూర్తంబున నంతఃపురకాంతలతోడం గూడం గదలవలయు నని
నిశ్చయించి మంత్రిసామంతుల కెల్లం బయనంబు చెప్పించి తానుం
బ్రయాణోచితవేషభూషితుండగుచు హెగ్గళ్ళం బిలిచి పల్లకులు గద
లింపుఁ డని నియోగించిన. ౪

శా. సాగెం బల్లకు లంత నాదశరథక్ష్మాపాలునాజ్ఞప్తి ము
త్యాగుచ్ఛస్ఫురదచ్ఛశోభ లెసఁగంగా జీని బంగారు మే
లిఁగ ల్గూర్చిన జాలకంబు లొఱపై దిండ్లొప్ప హొంబట్టుప
న్నాగంబు ల్తమిఁ జూచుచూపఱకు నానందంబు సంధింపఁగన్. ౫

గీ. కొన్ని పల్లకు ల్గొకటఁ గూడి నడచెఁ
బద్మములవ్రాఁత యపరంజిపంజరముల
నిగుడు జిగి యందులో నున్న నృపవధూము
ఖులకు నందంద చీఁకటు ల్దలఁగఁ జేయ. ౬

క. కొమ్ముల బంగరుటనుసులు
ముమ్మరముగ నెండ గాయ ముత్తెపుఁ బన్నా
గమ్ములు వెన్నెల గాయఁగఁ
గొమ్మలపల్లకులు కొన్ని గూడఁగనడచెన్. ౭

సీ. మ్రోల భూసురయుగ్మములు గూడి సుస్వరం
బులు గూర్చి యష్టకంబులు చదువఁగఁ
బసిఁడి యుంగరముల బారుకోలలు పూని
గొల్లలు సందడి యొల్లఁ దలఁగ
బంగారు పెట్టెలు పరికించుకొనుచు హె
గ్గళ్లు తేజీలపైఁ గడలఁ జనఁగఁ

బట్టికొడ్డలకనై ల్వట్టి నెన్నుడలచే
నుడిగంపుఁ జేడియల్ గెడలరాఁగ
నడచె దశరథవసుమతీనాథమౌళి
యగ్రమహిషుల కనకపల్యంకిక లట
మెఱుఁగుఁదీఁగెలలోపల మెఱయుచుండఁ
గమిచి ధరఁ జాగు చిత్రమేఘములలీల. ౮

గీ. పసిఁడిపల్లంపుజోకలఁ బఱఘవిల్లు
గోడిగలమీఁద ముసుఁగులు గొన్ని కదలెఁ
బల్లకులఁ గూడి పెదముసళ్లు గొంద
ఱిరుగడలయందుఁ దగ బరాబరులు సేయు. ౯

క. చని రటు మంత్రులు నందఱు
వెనుకం దేజీల నెక్కి వినయము భయముం
గనిపింప నాత్తవర్తన
వినుతి గనం జేయు శుద్ధవేషము లలరన్. ౧౦

సీ. కటగళన్మదములు కాల్వలై ప్రవహింప
సామజఘటలు పార్శ్వములఁ జెలఁగఁ
గనకకింకిణీకానికాయంబు మొరయంగ
రథసమూహములు సారథులు నడుప
ఖురఘాతధూళి దిక్కులఁ గ్రమ్మ నొక్కట
ఘోట్టాణహయములు గూడినడువ
నాయుధద్యుతులు మిన్నలమ నుద్భటవీర
భటనికాయంబులు బలసి కొలువ
వివిధవాద్యనినాదంబు దివియు భువియుఁ
జఱచి మ్రోయంగ బిరుదధ్వజములు మ్రోలఁ
బఱఘవిల్లఁగ నంత నప్పంక్తిరథుఁడు
గదలె శిబికాధిరూఢుఁడై ముదము వొదల. ౧౧

వ. ఇవ్విధంబున నద్దశరథమహీధవుండు సకలబలసమేతుం డై యంతః
పురకాంతలతోడం గూడం గదలి నదులు వనంబులు నగంబులుం
గడచి కతిపయప్రయాణంబుల నంగరాజరాజధాని డగ్గఱ రోమపా
దుండు ప్రమోదంబున నెదుర్కొని తోడ్కొని పోవం దత్పురంబుం
బ్రవేశించి యానృపాలుండు సేయు విడిదియులుపాలు[1] గైకొని
తన్మందిరమ్మునం గొన్ని దివసంబులు విందువీడుల నానందించుచు నంత
నొక్కనాం డతనితో ని ట్లనియె. ౧౨

క. ధరణీశతిలక నీకూం
తురు శాంతాకన్య భర్తతోం గూడంగ నా
పురికిం జనుదెంచి తిరి గిట
కరుదెంచుంగాని వేడ్క నంపంగవలయున్. ౧౩

చ. అన విని యంగభూవిభుండు నట్లయకా కని కూంతు నల్లుం దో
డ్కొని చను మన్న నానృపతికుంజరుండు న్ముద మొప్ప వారిం దో
డ్కొని చనియెం బురంబునకుం గోసలదేశమువారు మార్గపే
మ నిలిచి కాన్క లిచ్చి కన మన్నన వారల నాదరించుచున్. ౧౪

సీ. చామీకరధ్వజోజ్జ్వలవప్రసౌధంబు
పల్లవతోరణోద్భాసితంబు
సలిలసంసేకశీతలరాజమార్గంబుం
సంతతాగరుధూపసౌరభంబుం
జిత్రవిశేషభూషితభిత్తిభాగంబుం
బ్రతివీధికల్పితోన్నతరథంబు
స్వర్ణరంభాస్తంభసంభృతద్వారంబు
రంగవల్ల్యంకితప్రాంగణంబు
నగుపురంబుం బ్రవేశించె నవనివిభుండు
ఋశ్యశృంగుని మున్నిడి యిరుగెలంకుల
బలసమూహంబు మంత్రులు బలసికొలువం
బల్లకీలును దాను సంభ్రమము మెఱయ. ౧౫

1. విడిదివియులుపాలు-మూ.

క. అప్పుడు పౌరవధూమణు
లుప్పరిగలమీఁద నెక్కి యొక్కట లాజల్
గుప్పించిరి దశరథుపైఁ
గప్పెసఁగెడు తమదుచూపుఁగలువలఁ గూడన్. ౧౬

గీ. అంత నగరు ప్రవేశించి యంతిపురము
నందు నాఋశ్యశృంగుని నగ్ర పీఠి
నునిచి యర్ఘ్యంబుఁ బాద్యంబు నొసఁగి వేడ్కఁ
బూజ లొనరించె దశరథభూవరుండు. ౧౭

వ. అప్పుడు. ౧౮

ఉ. అంతిపురంబునం గలుగుసంగన లందఱు నెమ్మనంబుల
నంతస మొప్ప నేఁడు మనశాంతను గన్గొనఁ గల్గెనంచు న
య్యింతిని వేఱవేఱ తమయిండ్లకుఁ దోడ్కొనిపోయి యెంతయు
న్వింతలుగాఁగ సంతతము విందు లొనర్చిరి మచ్చికల్దగన్. ౧౯

వ. ఋశ్యశృంగుండును దశరథరాజుచేతం బూజ గైకొనుచుం దన్మందిరం
బున శాంతయుం దానును సంతసంబునం గొంతకాలంబు సుఖం
బున వసియించుచుండ. ౨౦

ఉ. వచ్చె వసంత మంతట నవత్వము మీఱుచు భూరుహావళుల్
హెచ్చఁగ నించువిల్లు వెస నెక్కిడి మారుఁడు పుష్పబాణముల్
గ్రుచ్చఁగ నల్లనల్ల నిలఁ గోయిలమూఁకల మూకభావము
ల్వచ్చఁగ భూజనుల్మిగుల వేడుక లబ్బె నటంచు మెచ్చఁగన్. ౨౧

క. అందంద చిలుకతేజిం
జిందులు ద్రొక్కించికొనుచుఁ జిల్లునఁ దేనె
ల్చిందుశరంబులు గైకొని
కందర్పుఁడు గుఱులు వైచెఁ గానసీమన్. ౨౨

క. కాంతలుఁ బురుషులుఁ గూడి ల
తాంతాక్రాంతంబు లగు వనాంతములందున్
సంతతముఁ జలిపి రెంతయు
సంతస మెసఁగ న్వసంతసమయోత్సవముల్. ౨౩

సీ. కలకంఠకలకలక్రమసమగ్రములైన
జొంపంపుఁగ్రొమ్మావిగుంపులందు
భ్రమరఝంకారసంభ్రమరంజితములైన
గొజ్జంగపొదరిండ్లపజ్జలందు
మధువర్షి కుసుమసంపత్సంభృతములైన
వకుళభూరుహములవాడలందుఁ
బవనధూతపరాగభరితతీరములైన
తెలిదమ్మికొలఁకులకెలఁకులందు
వేడ్క వనభోజనములు గావించి రపుడు
మావిపండ్లరసంబుతోఁ బూవుఁదేనె
దొప్పలను నించికొనుచు సొం పొప్పుచుండ
నంగనలుఁ దారు జనులు వనాంగణముల. ౧౪

వ. ఇత్తెఱంగున వసంతంబు సకలజనకాంతం బగుచుం గనుపట్టినం జూచి దశరథమహీకాంతుండు సంతసంబున సంతానార్థం బశ్వమేధంబు సేయవలయు నని తలంచి తనయంతఃపురమున సంతతంబును బూజలు గైకొనుచు శాంతాసమేతుం డై యున్న శాంతాకారుఁ గారుణ్యనిధి దేవవర్ణితచరిత్రు దేవవర్ణి ఋశ్యశృంగమునిపుంగవుం జేరంజనుదెంచి నమస్కరించి యి ట్లనియె. ౧౫

— దశరథుఁ డశ్వమేధయాగము చేయుట. —

గీ. ఇదె వసంతంబు వచ్చె నోఋశ్యశృంగ
మౌనిపుంగవ తామసింపంగవలదు
తురగమేధంబు సేయంగ దొరకొనుండు
సంతతి యొసంగు మీమంత్రశక్తివలన. ౧౬

వ. అనిన ఋశ్యశృంగుం డి ట్లనియె. ౧౭

క. తురగంబు విడువఁ బంపుము
సరగున హయమేధమునకు సంభారసము
త్కరములు సంపాదింపఁగఁ
బఱికించి ప్రధానవరులఁ బనుపు నృపాలా. ౧౮

సీ. అన విని దశరథుం డపుడు సుమంత్రుఁ బి
ల్వఁగఁ బంపి యోమంత్రివర్య నీవు
వైళంబ జాబాలివామదేవసుయజ్ఞ
కాశ్యపప్రముఖు లౌ ఘనుల నాదు
గురువులైన వసిష్ఠవరమౌని వెండియు
వేదాంతవిదుల ఋత్విజుల నెల్లఁ
దోడ్తోని రమ్మన్న వేడ్కతో నతఁడును
జని వారి నందఱ వినయ మెనయఁ
బిలిచి తెచ్చిన నమ్మనుకులుఁడు చూచి
మౌనులకు నెల్ల భక్తి నమస్కరించి
డెందమునయందు మోదంబు గందళింపఁ
బలికె ని ట్లని సరసవాక్ప్రౌఢి మెఱయ. ౨౯

చ. వినుఁడు మునీంద్రులార పృథివీపరిపాలనఖేలనంబుచే
ననుపమసౌఖ్యము ల్గలుగునంద్రు గదా యది యొక్కసౌఖ్యమే
తనయులు లేమి నిప్డు మది తల్లడమొందఁగ సౌఖ్యలేశముం
గనుఁగొన నైతి సంతతియె కారణ మెన్నఁగ సౌఖ్యపంక్తికిన్. ౩౦

క. తనయులకై హయమేధం
బొనరింపఁగవలయు ననుచు నున్నాఁడను మీ
రనుపమమంత్రవిధిజ్ఞుల
రనుకూలము సేయవలయు నాయజ్ఞంబున్. ౩౧

క. తొలుమేన నెట్టికర్మము
చలిపితినో యిప్పుడు పుత్రసంతానము లే
కలమట నొందెద సంతతి
కలిమికి హయమేధమఖము గావింపఁదగున్. ౩౨

క. ఈఋశ్యశృంగమునివరు
కారుణ్యముచే ఫలించుఁ గాంక్షిత మెల్లన్
వారును మీరును సంతతి
కారణముగ నధ్వరంబు గావింపుఁ డొగిన్. ౩౩

చ. అనిన వసిష్ఠమౌనివరుఁ డాదిగఁగల్గినమౌను లందఱుఁ
మన మలర న్విభండకకుమారుని మున్నిడి సాధుసాధు శో
భనమతి వైనయీనృపతి ప్రశ్నము సేసినరీతి గంటిరే
విన మిలనెందు నీదృశవివేకవిపాకము నెన్నఁ డేనియున్. ౩౪

మ. సుతసంతానము సద్గతిప్రదమటంచుం జాటునానాశ్రుతి
స్మృతిసిద్ధాంత మెఱింగి తత్సుతులకల్మిం గోరి ధర్మక్రమా
ర్జితవిత్తంబున నశ్వమేధముఖముం జేయంగ నూహించె ని
న్నృపతి సాధుస్తుతి కెల్లయోగ్య మగు నీభాగ్యంబు సామాన్యమే.

క. ఎంతటిధృతి యెంతటిమతి
సంతతిఫల మశ్వమేధసవనమువలనం
గాంతు నని పలికె దృఢముగ
నింతటిరా జెందునైన నిలలోఁ గలఁడే. ౩౬

చ. అని యిటు లవ్వసిష్ఠముని యాదిగఁగల్గిన మౌను లందఱుం
దనయులు నీకుఁ గల్గెదరు తప్పదు యాగము సేయుమంచుఁ బ
ల్కిన పలు కాత్మసమ్మదము గీల్కొనఁ జేయ నమాత్యవర్గముం
గనుఁగొని పల్కె సద్ధరణికాంతుఁడు సంతస మొప్పుచుండఁగన్.

క. నాగురువుల యానతిచే
సాగింపుఁడు యాగముఖసంభారంబుల్
వేగ నొనగూడఁ జేయుం
డాగమకోవిదులఁ బిలువనంపుఁ డిచటికిన్. ౩౭

క. ఏయెడల విశృంఖలగతి
నై యవనిం దిరిగిరాఁగ నశ్వము సోపా
ధ్యాయముగ విడువఁబంపుఁడు
పాయక వెనువెంట సకలబలములు గొలువన్. ౩౮

సీ. సరయూస్రవంతి యుత్తరతటంబునయందు
యజ్ఞభూమి యొనర్పుఁ డచట నచట
శాంతికవిధులు శాస్త్రము దప్పకుండంగ
వర్తిల్లఁ జేయుఁడీ వరముఖంబు

క్షితినాథులకు నెల్లఁ జేయంగ నచ్చుఁ బో
వొకటి లోపంబు లేకుండవలయుఁ
బగవట్టి విద్వాంసు లగు బ్రహ్మరాక్షసు
ల్విఘ్నంబు సేయంగ వేచియుంద్రు
క్రతువునకు విఘ్న మేదైనఁ గలిగెనేని
కర్తకుఁ గొఱంత వాటిల్లుఁ గాన మీర
లధ్వరం బెట్లు కొనసాగు నట్లు సేయుఁ
డనిన మంత్రులు నృపుమాట కలరి వేడ్క. ౮౦

క. భూనాథవంశమణి నీ
యానతిఁ దల మోచి యేము హయమేధంబుం
బూని యొనర్తుము తగ నె
ట్లైనను నీతలఁపు సఫల మగు నూహింపన్. ౮౧

వ. మహీపాల భవత్సంకల్పానుసారంబున నశ్వమేధంబునకు వలయు సంభారంబు లొనగూర్చెద మని పలికిరి వసిష్ఠాదిమేదినీసురులు భవత్సంకల్పంబు గొనసాగు సర్వంబు సంపన్నం బగు నని యమ్మహీశు నుపశ్లోకించిరి యమ్మంత్రివరుల ధరణీబృందారకుల నందఱ నంచి యవితథమనోరథుఁ డగుచు దశరథుండు నంత నశ్వంబు సమంత్రకంబుగా విడిపించి యంతఃపురంబున కరిగి సుఖం బుండె ననంతరంబ కర్మాంతికు లందఱు సంతసంబున. ౮౨

క. శాలలు గట్టిరి చాల వి
శాలతలు చెలంగుచుండ సరయూతటినీ
కూలమున సవనమున కను
కూలముగాఁ బనులహారువు కొమరొప్పంగన్. ౮౩

సీ. సోపానపంక్తులఁ జూపట్టుచుండెడు
సున్నంపుజగతుల సొంపువింపు
మొగసాలలును జుట్టు గగనంబుముట్టెడు
ప్రహరిగోడలు వింతపనుల మెఱయు

శయ్యాగృహములు భోజనకూటములుఁ బాక
శాలలుఁ గొలువుండు చావడులును
స్నానమందిరములు జలజకహ్లారసం
దీప్తంబు లగు కేలిదీర్ఘికలును
జలువపందిరులును వేడ్కఁ సలుపుచుండ
భూభుజల కెల్ల నుపకారికాభవనము
లెన్నియేనియుఁ గట్టి రెల్లెడల మిగులఁ
బఱపు నిడుపును గలుగ సంభ్రమము చెలఁగ. ౪౪

క. భూవలయంబునఁ గల నా
నావర్ణంబులకు నెల్ల నవముగ విడుదల్
గావించి రెన్నియేనియు
నేవంకం గనిన వీథు లేర్పఱచుండన్. ౪౫

చ. నరవరు లంత సద్ధరణినాయకునానతి మోచి వచ్చి ర
థ్యవరముం గనుంగొనెడు వాంఛలచే నరదంబులు న్మద
ద్విరదములుం దురంగములు వీరభటౌఘము గొల్వ నుల్లస
ద్విరుదపతాకికానికరదీధితు లంబర మెల్లఁ గప్పఁగన్. ౪౬

సీ. దశరథమేదినీధవుఁ డశ్వమేధంబు
సలుపుచున్నాఁడఁట యలఘుహిమ
సతనియజ్ఞంబున నాగంతుకుల కెల్ల
వలసినట్టులు భక్ష్యములు గల వఁట
భోజనంబును గాక భూజనంబున కిత్తు
రఁట రత్నమయభూషణాంశుకములు
నెందఱే వచ్చిన నందఱ కచ్చోట
విడుదలు గల వఁట వేడ్క వెలయ
ననుచు నొండొరుఁ జీరుచు నఖిలదేశ
వాసులగు బ్రాహ్మణక్షత్ర వైశ్యశూద్ర
వరులు సాకేతపురమున కరుగుదెంచి
రవనినాథుని యధ్వరోత్సవముఁ జూడ. ౪౭

వ. ఇవ్విధంబునం జతురర్ణవీవలయితవసుంధరావలయంబునం గల చతు
ర్వర్ణంబులవార లెల్లం జనుదెంచినం గనుంగొని వసిష్ఠమహర్షి మనం
బున హర్షించుచు దశరథమహీధవునితో ని ట్లనియె. ౭౮

క. భవదీయశాసనంబున
సవనమహోత్సవముఁ జూడ జనకాదిమహీ
ధవు లెల్ల వచ్చి యిదె పుర
సవిధస్థలులందు నిండసాగిరి వేడ్కన్. ౭౯

క. అర్ణవవృతధరణిఁ జతు
ర్వర్ణంబులవార లెల్ల వచ్చిరి క్రతువుం
బూర్ణ మగు నీదుభాగ్యము
వర్ణింపఁ దరమె యెందు వసుధాధీశా. ౮౦

క. పరిపూర్ణ మయ్యె సంవ
త్సరమును నశ్వంబు వచ్చె ధరణిఁ దిరిగి భూ
వర సరయూతటమున నిఁకఁ
దురంగమేధంబు సేయ దొరకొనవలయున్. ౮౧

క. రమణులతోడుత సుముహూ
ర్తమునం గ్రతుశాల కరిగి తత్క్రతుదీక్షా
క్రమ మెల్ల నడపు ఋత్వి
క్ప్రముఖుల నియమించు సవనకర్మ మొనర్పన్. ౮౨

సీ. అన విని యట్లకా కని యానృపాగ్రణి
సైద్ధాంతికసమూహసమ్మత మగు
శోభనదినమున సుముహూర్తవేళ నం
తఃపురకాంతలుఁ దాను నొకట
మణిమయానేకభూషణభూషితాంగులై
చేడియ లుడిగము ల్సేయుచుండ
ఋశ్యశృంగుఁ బురస్కరించి వసిష్ఠప్ర
ముఖభూమిదివిజులు మ్రోలఁ జనఁగ

శంఖదుందుభివాద్యనిస్వనము లెసఁగ
నగరువెడలి జనంబు లానంద మొంది
తనమహావైభవంబుఁ గన్గొనఁగ నాత్మ
నలరుచును యజ్ఞశాలకు నరిగె నంత. ౫౩

చ. జనపతి యజ్ఞశాలకు ససంభ్రమతన్ రమణీజనంబుతోఁ
జన నపు డభ్రమార్గమున సారెఁ బ్రదక్షిణలీల విష్ణువా
హనములు సుస్వరమ్ముల జయంబులు దెల్పుచు సంచరించెఁ జం
దనగిరిమందగంధపవనం బనుకూలత మించె నెంతయున్. ౫౪

గీ. యాగశాలకు నట్లేఁగి యవనివిభుఁడు
దీక్షగైకొని యంత ఋత్విజులఁ బిలిచి
క్రతువు నడపింపుఁ డనుచుఁ బల్కంగ వారుఁ
జెలఁగి కూశ్మాండగణహోమముల నొనర్చి. ౫౫

వ. ఋశ్యశృంగుఁ బురస్కరించుకొని యశ్వమేధయాగప్రయోగంబు నడ
పం దొడంగి రప్పుడు. ౫౬

ఉ. ఆనరనాథుయాగసదనాంగణభాగమునందు ఋత్విజు
ల్భానురుచు ల్దొలంకు జిగిబంగరుపళ్లెరముల్ గరంబులం
బూని శుభస్వరంబులఁ బ్రమోదము మీఱుచునుండ దేవతా
హ్వాన మొనర్చి రందఱు సురావలియంబరవీథిఁ జూడఁగన్. ౫౭

గీ. ఋశ్యశృంగుండు క్రతువుఁ జేయింపఁ దొడఁగె
నన్నిదిశల నాధ్వర్యవహోత్రభాగ
తంత్రవిదులైన బ్రాహ్మణోత్తముల నెల్ల
నుండ నియమించి వేడ్క విధ్యుక్తసరణి. ౫౮

క. ఆలోచనామహర్షులు
చాలం దలయూఁచి మెచ్చ సవిధికముగ జి
హ్వాలకృశానువిశాల
జ్వాలల వేలిచిరి మునులు సాన్నాయ్యంబుల్. ౫౯

క. అయ్యాగశాలలోపల
ధాయ్యాసంధుక్షితాగ్నితాపసహుతసా

న్నాయ్యనవసౌరభము సుర
లయ్యారే యనఁగ దిక్కు లలమెఁ దొడంగెన్. ౬౦

క. గుమ్మనుచు హవిర్గంధము
గ్రమ్ముచు నలుగడల నిగుడఁగాఁ గర్పురవ
ర్ణమ్మగుచు హోమధూమము
నమ్మఖశాలలను వెడలి యంబర మలమెన్. ౬౧

ఉ. ఆమహిపాలుయజ్ఞసదనాంతరసీమలఁ జూడ నెల్లెడన్
సామగసామగానములు చాలవినం జవియయ్యెఁ గోకిల
స్తోమము పంచమస్వరము సొంపులునింపఁగఁ గ్రోల్చినట్టు లు
ద్దామసుధామధుద్రవము ధారలుగా భువి నిండుకైవడిన్. ౬౨

ఉ. గండయుగస్థలంబుల నఖండమణీఘృణిమండలస్ఫుర
త్కుండలము ల్నటింపఁగ నెదుర్కొని వాద మొనర్చి మాటికిం
బండితకోటి యాధరణిపాలకునధ్వరవాటి నిండి వై
తండికమార్గవక్రితరతర్కవచఃక్రమము ల్చెలంగఁగన్. ౬౩

క. ప్రతిదివసము నయ్యజ్ఞా
యతనమున భుజించు రప్పు డవనిసురు లవా
రితముగ నిండుచ్ఛాయా
యుత మగు నన్నంబు షడ్రసోపేతముగన్. ౬౪

క. గ్రుక్కిళ్లు వెలయ డాచేఁ
బ్రక్కలు నిమురుచును శాకపాకంబుల న
మ్మక్క యటంచుం బొగడుచు
నొక్కట వేడుక భుజించి రుర్వీదివిజుల్. ౬౫

సీ. అయ్యల కిచట గంగామృతంబులు తెండు
వేఁడియన్నములు వేవేగ నిడుఁడు
వడ్డింపుఁ డీబంతి నిడ్డెనకుడుములు
నేయి దొప్పలనిండఁ బోయుఁ డిందుఁ
గూర లన్నియు మాఱు గొంచురం డందఱుఁ
దియ్యచారులు సారె దెండు చాల

మజ్జిగపడిదెము ల్బజ్జిను లడుగుండు
కుప్పలింపుఁడు చాయపప్పులెల్లఁ
గ్రుమ్మరింపుఁ డిచ్చోటులఁ దిమ్మనంబు
లనెడుపల్కులె యజ్ఞశాలాంతరమునఁ
గూడి వినవచ్చె మంథానకుధరమథిత
జలనిధానవినాదంబుసరణి నపుడు. ౬౬

క. ఘృతగుడపాయసములతో
సతతము భుజియించె మూకజడబధిరాంధ
ప్రతతియుఁ బంగుగ్లాని
ప్రతిభిక్షుశ్రమణనాథవన్నివహంబుల్. ౬౭

ఉ. గంతులువైచుచు న్నగుచుఁ గాంచనశోభితరత్నమేఖలా
కాంతులు దిక్కులు న్నిగుడఁగాఁ బరివేషకు లప్పు డచ్చటన్
బంతులరీతి సూపఘృతపాయసపాత్రలఁ బట్టి యాడుచు
న్బంతులవెంట వేడుక లొనర్చిరి చూపఱ కెల్లనెల్లెడన్. ౬౮

సీ. అన్నకూటంబులు నాజ్యకటాహముల్
శర్కరోత్కరములు శాకతతులు
సూపరాసులును నపూపసమూహముల్
పాలకాఁగులు ఫలప్రకరములును
వెన్నదిన్నెలు నాలజున్నుకుప్పలుఁ దేనె
బిందెలు మీఁగడపెరుఁగుతొట్లుఁ
బరమాన్నపాత్రలుఁ బానకంబులకొప్పె
రలు నీరుమజ్జిగకొలఁకుగములుఁ
దియ్యదెలినీటిబావులుఁ దెప్పలగుచు
వేలసంఖ్యల మించి యవేలగతులఁ
జూపఱుల కద్భుతంబులు చూపె నప్పు
డమ్మహీనాథు యాగశాలాంతరముల. ౬౯

క. క్షీరాజ్యాహుతుల మహా
క్షీరములఁ బ్రవర్గ్యలెసఁగె వితతాగ్నిశిఖా

ధోరణి మిన్నులు ముట్టఁగ
సారెకు వేడుకల సకలజనములుఁ జూడన్. ౭౦

సీ. సరిగ చిత్రపుఁగుట్ల సరిలేని ముత్యాల
బవిరిచౌకట్టులు[1] పరిఢవిల్లఁ
గుబుచగేదంగితేకుల యల్లికల మించు
జడలు పిఱుందుల బెడఁగు చూప
జిగిపైఁడియందెలవగల చందురకావి
నెఱికకాసెల నిగనిగలు నిగుడ
నభినయంబుల నేర్పు లలరించుకంకణ
కలితహస్తముల సింగార మమర
ఘనతరమృదంగధింధిమి ధ్వనులు సెలఁగ
వింతకోపులు మెఱయంగ వేశ్య లపుడు
నాట్య మొనరించి రమ్మహీనాథవహ్ని
యాగశాలాంతరద్వారభాగములను. ౭౧

గీ. అంతఁ బ్రాతస్సవనము మాధ్యందినసవ
నముఁ దృతీయసవనమును గ్రమముతోడఁ
జలిపి రాఋత్విజులు మహాసంయములును
మంత్రతంత్రవిశేషసామగ్రి మెఱయ. ౭౨

వ. విశ్వకర్మీయతంత్రచాతురీచతురాననకల్పులగుశిల్పులప్పుడు ఋత్విక్ప్రముఖులం బురస్కరించుకొని బైల్వంబు లాఱును, ఖాదిరంబు లాఱును, బిల్వసహితంబు లగు పలాశంబు లాఱును బాహువ్యస్తపరిగ్రహంబు లగు శ్లేష్మాతక దేవదారువులు రెండునుం గా నిరువదియొక్క యూపంబులు శ్లక్ష్ణరూపంబులుగా నష్టాంగసంగతంబు లేకవింశత్యరత్నిప్రమాణసహితంబులు గావించి యొండొంటి కేకవింశతి వసనంబులు పొసంగించి యన్నింటికిం గనకచషాలంబులు గీలించి గం

1. బవరిచక్కట్టులు- మూ.

ధపుష్పాక్షతంబుల నలంకరించి ప్రతిష్ఠించి రయ్యూపంబులు దేదీప్య
మానంబు లగుచు నాకసంబునం బ్రకాశించు సప్తర్షులజోకం బ్రకా
శించుచుండె. ౨3

శా. ఆఋత్విక్కులు నంత నిష్టకలచే నందంబు మీఱం జతు
స్రారం బొప్పఁగ రుక్మపక్షగరుడాకారంబుగాఁ బన్ని యం
దారూఢస్థితిఁ జేసి రగ్నిచయనం బాశ్చర్యచర్య న్సహో
దారప్రక్రియ మంత్రతంత్రవిభవవ్యాపార మేపారఁగన్. ౨౪

సీ. అంత ఋత్విజు లెల్ల నాయాజ్ఞహయమును
శామిత్రమున నిల్పి జలచరాది
పశువుల మున్నాటిఁ బాటించి యందుతోఁ
గూడ యూపములందుఁ గూర్చికట్టి
విశసింపకయ వాని విడిచిరి కౌసల్య
తత్తురంగంబుఁ బ్రదక్షిణంబు
గావించి నిశితఖడ్గంబులు మూఁడు గై
కొని విశసించె నెమ్మనము వొదల
హోత యధ్వర్యుఁ డుద్గాతయు ను గడంగి
హయముతోఁ గూర్చి రారాత్రి యధిపుసతుల
ముప్పురను వారు భక్తిసొంపున హయంబు
నొందఁ బరిచర్యచేయుచు నుండి రంత. ౨౫

క. నిపుణత ద్విజు లయ్యశ్వము
వప డించి సమంత్రకముగ వరవైతసశా
ఖపయి నిడి వేల్చి రుత్కట
కృపీటభవకీలలందుఁ గీల్కొనుచుండన్. ౨౬

క. అప్పుడు వప చిటచిట మను
చప్పుడుఁ బ్రజకేలు చఱచుచప్పుడు నొగిసొం
పొప్పఁగ నేక మగుచుఁ గ
కుప్పటలము నెల్లఁ జాల ఘూర్ణిలఁజేసెన్. ౨౭

గీ. అంత ఋత్విజులెల్ల నాయజ్ఞహయము
నంగములనెల్ల వేల్చిరి యగ్నియందు
సకలసురసంఘ మెల్లను సంస్తుతింప
నంగహోమంబు సాంగమై యతిశయిల్లె. ౭౮

గీ. కల్పసూత్రోక్తసరణి సంకల్ప మొనర
ధరణినాథుని యశ్వమేధంబునందు
మూఁడు సుత్యాహములు సాంగముగ నొనర్చి
రమరులు నుతింప ఋత్విజుల్ క్రమముతోడ. ౭౯

వ. మఱియు జ్యోతిష్టోమంబు నప్తోర్యామంబు నభిజిత్తు విశ్వజిత్తు నుక్థ్యం బతిరాత్రంబు మొదలగు నుత్తరక్రతువులుం గ్రమప్రాప్తి నొనర్చి రంత. ౮౦

మ. ఘనసాన్నాయ్యవిసారిసౌరభసమాక్రాంతాష్టదిక్సీమ మై
యనఘం బై మఘవన్ముఖామరనుతం బై ఋశ్యశృంగాదిస
న్మునిరాణ్మంత్రవచఃప్రణీత మయి సంపూర్ణ ... సంతుష్టభూ
జనసంఘం బయి సాంగమై మెఱసె నాక్ష్మాపాలుయజ్ఞం బిలన్.

వ. అంత నమ్మహీకాంతుండు బ్రహ్మనిర్మితప్రకారంబున యజ్ఞదక్షిణగాఁ దా నేలు భూమియందు హోతకుఁ దూర్పుదిక్కును బ్రహ్మకు దక్షిణక్షోణియు నధ్వర్యునకుఁ బశ్చిమాశయు నుద్గాతకు నుత్తరంబు నుదత్తంబు సేసె నాఋత్విజు లందఱు నుల్లంబు లలర నమ్మహీవల్లభుం గనుంగొని యి ట్లనిరి. ౮౨

సీ. జననాథ నీవొసంగినయట్టి దక్షిణ
యక్షీణమై సాంగ మయ్యెఁ జాల
మాకు సమ్మద మయ్యె మణిసువర్ణము లెవ్వ
యైన నీడుగ నిచ్చి యవని యెల్లఁ
దిరుగఁ గైకొనుము మేదిని యేల బ్రాహ్మణుల్
తగుదురె క్షత్రియోత్తములుగాక
బ్రహ్మ మొదల్గొని బ్రాహ్మణు లర యేలి
రనుమాట యెందైన వినుట గలదె

యరయఁ గప్పలమాట బ్రాహ్మణగణంబు
గూడియుడంగ నేర దీక్షోణిభరము
దాల్ప శక్తులె నీవ యుద్ధరణి యెల్లఁ
జేకొనుము క్రమ్మఱంగ దక్షిణ యొసంగి. ౮3

ఉగ్రశాసనుఁ డగుక్షత్రియోత్తముండు
శిష్టరక్షణమును దుష్టశిక్షణంబుఁ
జేయుచును భూమి యేలినఁ జెల్లుఁగాక
బ్రాహ్మణులు శక్తులే మహీభరము దాల్ప. ౮౪

వ. అనిన విని యట్లకా కని యమ్మహీవల్లభుం డాఋత్విజులకెల్ల మనః ప్రత్యయంబు చెలంగ భూమికిం బ్రత్యామ్నాయంబుగా దశలక్ష ధేనువులు దశకోటిసువర్ణంబులు సువర్ణచతుర్గుణరజతంబులు నొసంగె వార లవి యెల్లం గైకొని ఋశ్యశృంగవసిష్ఠమునిపుంగవుల ముంగలనిడి యందఱు యథోచితంబుగా విభజించి పుచ్చికొని రంత. ౮౫

క. అసమానయశోధనుఁ డా
వసుధావిభుఁ డఖిలదేశవాసులు మెచ్చన్
వసుమణిసందోహంబులు
ప్రసర్పకబ్రాహ్మణులకు భక్తి నొసంగెన్. ౮౬

ఉ. వారిజబాంధవాన్వయుఁ డవారితదానఘనుండు సద్గుణా
ధారుఁడు ధీరుఁ డాదశరథక్షితినాథుఁడు యాగదీక్షఁ జేఁ
గోరికివచ్చినట్టి జనకోటులకెల్లను జాలునట్లుగా
భూరిమహార్ఘ్యరత్నములు భూరిగ నిచ్చె ముదంబు హెచ్చఁగన్. ౮౭

క. అవనీవిభుఁ డయ్యెడ నొక
యవనీదివిజుండు చేరి యడిగినయంతన్
నవరత్నహస్తకటకం
బవిశంకత నొసఁగె జనము లచ్చెరు వందన్. ౮౮

క. ఇప్పగిదిన్ ధనకోటులు
తెప్పలుగా నొసఁగి భూమిదివిజులకు ముదం

బొప్ప నొనర్చెఁ బ్రణామం
బప్పుడు సాష్టాంగముగ జనావళి వొగడన్. ౮౯

వ. ఇట్లు నమస్కరించినం గనుంగొని యందఱు హర్షంబున. ౯౦

శా. ఆయుష్మాన్ భవ పుత్రవాన్ భవ సమగ్రానందసాంద్రో భవ
శ్రీయుక్తో భవ యంచు భూమిసురు లాశీర్వాదముల్ సేసి ర
త్నాయత్తాంచితధర్మశీలు సుగుణోద్యత్కీర్తిశోభాసము
చ్చాయద్యోతితలోకు నాదశరథక్ష్మాపాలచూడామణిన్. ౯౧

క. ఆదశరథుఁ డీవిధమున
మోదము మీఱంగ విప్రముఖ్యులయాశీ
ర్వాదములం బొదలి యంతట
వేదనిధి న్ఋష్యశృంగు వినయం బెనయన్. ౯౨

వ. కనుంగొని నమస్కరించి యి ట్లనియె. ౯౩

గీ. ఋష్యశృంగమునీంద్ర మహేశసదృశ
మహితచిత్రచరిత్ర నీమహిమవలనఁ
దురగమేధంబు గడతేఱె సరగ నింకఁ
బుత్రకామేష్టి సేయంగఁ బూనవలయు. ౯౪

క. శ్రోత్రియులు నుత్తములు నగు
ధాత్రీసురవరులఁ గూడి తడయక వేడ్కం
బుత్రీయేష్టి యొనర్పుఁడు
పుత్రులు గలుగంగ నాకుఁ బుణ్యచరిత్రా. ౯౫

వ. అనిన విని ఋష్యశృంగమునిపుంగవుండు నంగీకారంబు సెలంగ నో
ధాత్రీశ యట్లన నీకుం బుత్రులు గలిగెదరు మనమ్మున నమ్ము మధర్వ
శిరఃప్రోక్తంబు లగు మంత్రవిశేషంబులం బుత్రేష్టి గావించెద నని
కడంగి సకలయజ్ఞకర్మపరినిష్ఠితు లగు వసిష్ఠాదిమునిశ్రేష్ఠులం గూర్చు
కొని శుభముహూర్తంబున వివిధవిచ్ఛందకసంఘటనాధురీణనిపుణశి
ల్పివరకల్పిత పరిపక్వేష్టకచితంబునుం గనకమయానేకపట్టాంబరాలం
కృతంబును సౌగంధ్యబంధుస్వచ్ఛకుసుమగుచ్ఛశోభితంబును బహిరం

తరావరణదేవతాధిష్ఠితంబునుం బ్రాజ్యసమిదాజ్యచరుసంభారసంభృతంబు ను ధ్రువోపభృజ్జుహూప్రముఖపాత్రవిస్తారితంబు నగు మండపంబునందుం బూర్వాదిదిగవస్థిత గణేశాష్టదిక్పాలకాది దైవతంబును బ్రాహ్మ్యాదిమాతృకాధిష్ఠితంబు ను హోమవిధానలక్షణలక్షితంబు ను నఖండమేఖలాత్రయమండితంబును నగుకుండంబునందు నగ్నిం బ్రతిష్ఠించి దర్భాస్తరణపూర్వకంబుగా నగ్నిముఖంబు గావించి తా నాచార్యుం డై యన్నిదిక్కుల ఋత్విక్కుల సమిద్ధోమంబు సేయ నేమించి చరుహోమంబు సేయం దాన పాలుపడి యాలోచనామహర్షులు చూచి తల యూఁచి మెచ్చం బవిత్రధవిత్రవీజనసంధుక్షితంబై ప్రదక్షిణార్చి యగు నగ్నిహోత్రంబునందు నాథర్వణమంత్రంబుల వేల్వం దొడంగె నాసమయంబున యాగభాగంబులకై గరుడగంధర్వకిన్నరకింపురుషసురగణంబులతోడ నింద్రాగ్నియమ (నిర్రృతి) వరుణవాయుకుబేరేశానులు వచ్చి యచ్చోట నిలిచిరి మహర్షులుం జనుదెంచి రంత. ౯౬

ఉ. కాంచనగర్భుఁ డాక్రతువు గన్గొను వేడుక నేఁగుదెంచెఁ గ్రొ
మ్మించుల నీనుచుండు తనమేని మెఱుంగులతోడఁ గూడి డా
లించు పసిండిఱెక్క జిగిలీలలు మించుచునుండ నొప్పురా
యంచపటాణి నెక్కి యమరౌఘము గొల్వఁగ సమ్మదంబునన్. ౯౭

వ. ఇట్లు చనుదెంచి యయ్యాగశాలాసమీపంబున ననర్ఘమణిగణోద్దంచితం బగు కాంచనపీఠంబునం గొలువు గూర్చుండి సిద్ధచారణస్తుతులాకర్ణించుచు నందంద వందనంబులు సేయు మునిబృందంబులం జతుర్ముఖోదితంబు లగు మృదుభాషణంబుల బహూకరించుచు నుండె నాసమయంబున. ౯౮

క. రావణపరిపీడితు లగు
దేవత లందఱును గూడి దీనవదను లై
యావనజాసనునకు నతి
గావించి వినీతి మెఱయఁగాఁ బల్కి రొగిన్. ౯౯

శా. వాణీమోహన హంసవాహన నమోవాకంబు నీకున్ జగ
త్ప్రాణిశ్రేణిలలాటలేఖనకళాపారీణ దండంబు నీ
కేణాంకార్కసహస్రతేజ నతి నీకీవే కృపాలోకము
న్వీణామౌనిసనందనాదిజనకా నీకుం బ్రణామాంజలుల్. ౧౦౦

క. సరసితివిలయముల ని
సర్గగతి న్నీ వొనర్తు శతధృతిమధుజి
ద్భర్గస్వరూపలీల న
నర్గళమహిమైకవిభవ యంభోజభవా. ౧౦౧

ఉ. రావణనాముఁ డైనయొకరాక్షసుఁ డిప్డు పుట్టి సర్వలో
కావలిఁ దాన కావలిగ నంతయు నేలుచు నిర్జరోత్తముల్
సేవకు లై తనుం గొలువఁ జేయుచు గర్వము దొట్టియున్న వాఁ
డో వనజాసనా జనుల కుండఁగరాదు జగంబులోపలన్. ౧౦౨

క. దేవర వర మిచ్చితి రని
గావరమున మీఱి వాఁడు కడు నుద్ధతుఁ డై
దేవరమణులం జెఱ గొని
యేవఱకును[1] లేని బాధ లెసఁగం జేసెన్. ౧౦3

క. ఏయెడఁ జూచిన లోకని
కాయము రావణునిచేతికాల్పులఁ బూర్వ
చ్ఛాయ లెడలి దగ్ధపట
న్యాయంబున నుండఁ దొడఁగె నంభోజభవా. ౧౦౪

క. అని యిట్లు విన్నవించిన
విని యప్పరమేష్ఠి యపుడ వేల్పుల నెల్లం
గనుఁగొని భయపడ నేటికి
వనజాక్షుఁడు హరి జగన్నివాసుఁడు గలుగన్. ౧౦౫

క. వర మిచ్చితి మే మెఱుఁగక
సురరిపునకు వాఁడు జగముఁ జూఁడఁగ సాగెన్

1. యేవరకుని- మూ.

హారి యించుక యిది విన్నను
హారియించు న్నావనిగర్వ మనిమిషులారా. ౧౦౬

క. శ్వేతద్వీపమునకుఁ జని
శ్రీతరుణీపతికి నెఱుకసేయుఁడు వేగం
బీతెఱఁ గంతయు నప్పుడ
యాతంకము లెల్లఁ బాయు నాహరికరుణన్. ౧౦౭

వ. అనిన విని యట్ల కాక యని యప్పురందర ప్రముఖ బృందారకు లందఱు నవ్విరించిం బురస్కరించుకొని చని రంతఁ దదనంతరకథావృత్తాంతం బెట్టి దనిన. ౧౦౮

శా. కళ్యాణాచలధీర సాధితజగత్కళ్యాణ వాత్సల్యసా
శీల్యాద్యద్భుతకృన్మహాగుణఖనీ సీతాసతీనేత్రసా
ఫల్యాపాదనమోహనాంగ ఘనశోభా సంభృతోజ్జ్వల్య కౌ
సల్యానందన చంద్రచందనసుధాచంచద్యశోభాసురా. ౧౦౯

క. భాస్వత్కులైకభాస్వర
భూస్వర్గాంచితయశోవిభూషణ దోర్వీ
ర్యస్వవశీకృతలోక ము
నిస్వాంతవిహారగేహ నిహ్నుతమోహా. ౧౧౦

భుజంగప్రయాతము.

శరాసారసంభిన్నసంగ్రామరంగా
శరాసారదోర్వీర్యసత్యప్రతిజ్ఞా
ధరాధార ధారాధరస్పర్ధిమూర్తీ
సురాహారనీహారసుస్నిగ్ధకీర్తీ. ౧౧౧

గద్యము. ఇది శ్రీరామచంద్రసాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేషనిరర్గళ వాగ్వైభవ వాశేమసరససాహిత్యకళాభోజ, సత్యసంభూషిత ముఖాంభోజ, సకల సామ్రాజ్యధారేయ, నిత్యవితీర్ణి ధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషిత పంచాశత్సహస్రభూసుర, బహు

వారావర్తిత మహాదాన వైభవానర్తిత కీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత చోళధరామండల, నిఖిలభోగవిభవనిర్జితాఖండల, సాధితసముద్రాంతరద్వీపపరనృపాలసంస్తుతప్రతాప, నేపాలభూపాల స్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య, రామసేతుశ్రీరంగవిజయరాఘవపుర కుంభఘోణాదిదివ్యస్థలప్రతిష్ఠాపితరామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రానిర్జితసముద్ర, సదాశ్రితభరణదీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్య, దిగంత ప్రసిద్ధతరౌదార్య, సుజ్ఞానజనక, సంతతసంసేవితజనక, పోషితవిద్వత్ప్రియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీతసామంతమహీకాంతవిమోచన శ్లాఘనీయబాహుబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వయామ్యుతనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితసుమసాయక, సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతం బైన శ్రీమద్రామాయణంబున విబుధజనవినుతవివిధకథాశాఖాప్రకాండం బగు బాలకాండంబునం దృతీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# రఘునాథరామాయణము

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరఘువంశనృపోత్తమ
నీరనిధినిబంధనైకనిపుణఘనబలో
త్సారితరిపుప్రచారణ
చారణసంస్తూయమానశౌర్యాభరణా. ౧

వ. అవధరింపు మాసమయంబున. ౨

చ. సురవరు లెల్ల నేఁగి యట చూచిరి వేడుక సంఘటిల్లఁగా
శరశరదభ్రశుభ్రకరచందనకుందనవప్రభావిభా
సురపరితస్ఫురద్గగనచుంబితరంగఘటీఘటాళిసం
గరకరణోద్యమోద్యదధికధ్వనిబోధిసుధాపయోధినిన్. ౩

సీ. ఇంద్రముఖ్య దివౌకసు లెల్ల నపుడు
మంద్రబృంహిత గజశోభమానచటుల
చంద్రమండలపాండురోజ్జ్వలతరంగ
సాంద్ర మగుపాలసంద్రంబుఁ జక్కఁ జూచి. ౪

వ. తద్వైభవంబునకుం జాలం దలయూఁచి మెచ్చుచు నిందుకుందగుచ్ఛస్వరూపం బగు శ్వేతద్వీపంబుం గనుంగొని యుప్పొంగుచు నొండొరులతోడ. ౫

### — శ్వేతద్వీపవర్ణనము. —

సీ. సింధురాజెదను వైచిన మధ్యహారినీల
శాలి యాదవ్రజాలతాళి యనఁగఁ
బవిభీతి నీటిలోపల నుండుతనయుఁ గ
న్గొనఁగ వచ్చిన మంచుఁగొండ యనఁగఁ

పాలసంద్రపువెండిపళ్ళెరంబునడుమ
నున్న ముత్తెపుఁజిప్పగిన్నె యనఁగ
దనుజాళిపైఁ బాశి దండుపో నెత్తిన
డాలించు తెల్లగుడార మనఁగఁ
బాంచజన్యంబు శౌంచేపట్టు గాంచి
మించె నిటు మాకు నితని వహించఁ గలుగు
ఘనయశం బని యచటిశంఖంబు లెల్లఁ
దిన్నగా నిల్చె ననఁ దెల్ల దీవి మెఱసె.

సీ. పా లగ్గలముగాఁగఁ గ్రోలి యొకింతైనఁ
గదలని పాండుమేఘం బనంగ
మున్నీటిపాళెంపుమన్నీఁడు కొలువుండు
మేలైన ముత్యాలమేడ యనఁగ
హరిభీతి లేకుండ నద్రులఁ బాలింప
జలధి పూనిన వజ్రఫలక మనఁగ
రతనంబు లుండునీరధిదంతపేటిపైఁ
జెన్నారు బటువైన శిఖర మనఁగఁ
దనభువన మెల్ల నిండునీవనధి యెంత
కోటిపై నాక్రమించెనో చూతు ననుచుఁ
బైకి నిక్కిన శేషునిఫణిసహస్ర
మండలం బనఁ దెలిదీవి నిండికొనియె.

సీ. తనమామగారైన వననిధిభర్తఁ గ
న్గొనఁగ వచ్చినచుక్కగుం పనంగఁ
దనుఁ జుట్టుకొను నహితతి ఫణిపురిఁ జేర్పఁ
జనుదెంచిన పటీరశైల మనఁగ
శివుని చిచ్చుఱకంటి సెక సోఁక నబ్ధి నా
గళమగ్న మగు వెండిగ ట్టనంగఁ

గడలి కళంకపంకక్షాళన మొనర్పఁ
జేరిన కలువలచెలి యనంగ
జలనిధానంబు తనకుఁ గావలసి నాక
నాయకున కీక దాఁప నానాఁటఁ బెరిఁగి
గుములుగాఁ బైకి వెడలిన యమరతరుల
పూవుఁగొమ్మలు నాఁ దెల్లదీవి మెఱసె. ౮

గీ. దుగ్ధసాగరకర్దమదిగ్ధమైన
యాదికమఠంబు బహుకాల మచట నుండి
మందరము మోచినట్టి శ్రమంబు దీఱఁ
దేలెనో పైకి ననఁ దెల్ల దీవి మెఱసె. ౯

క. ఉదధి మథియించు వేళల
నుదయించిన యమృతపూర మొకచో నచటం
బదిలంబుగ నిలిపిరొకో
త్రిదశు లనఁగ శీవిఁ దెల్లదీవి చెలంగె౯. ౧౦

సీ. రమ పెండ్లినాఁటిముత్తెములప్రాల్నిండిన
విధుకాంతమణికాంతవేది యనఁగ
జలవారణముల పోరులు చూచు సలిలభ
ర్తకు నొనర్చిన వెండి తమక మనఁగ
జలశాయి హరినాభి చతురాస్యుఁ గొలువ వ
చ్చిన వాహనమరాళసేన యనఁగ
మున్నీటిరాయని ముంజేతి వజ్రమ
య పు హంపీరుతాయత యనంగఁ
బాలసంద్రంబు ఘనయాచకాళి కెల్లఁ
దోరహత్తుగఁ దనరసపూర మిత్తు
ననుచు నెత్తిన ధవళపట్టాంబరధ్వ
జం బనఁగఁ బాండురాంతరీపంబు వెలయు. ౧౧

సీ. సీరధిరా జల్లునికిఁ బవళింపఁ గా
వించిన దంతంపుమంచ మనఁగ
నిచ్చఁ బెండ్లి యొనర్చు నీరుపాపలపైని
బట్టు తెల్లని యుల్లభం బనంగఁ
బాశినగరిలోని పాత్రలు లాగెత్తు
మేలి వజ్రపులాగుమేడ యనఁగ
మరకతచ్ఛవి మించు హరి యుండు నిర్మల
స్ఫటికసంఘటితపంజర మనంగఁ
గలశవారిధి ద్రచ్చుటకన్న మున్ను
గొన్ని దినములు శశి లోన నున్నవేళఁ
బొడ వెగయు నంశుతతులచేఁ బొడమి పేరి
తిన్నె యగుమంచనఁగఁ దెలిదీవి మెఱయు. ౧౨

సీ. అంబుకేళికి వచ్చి యడుసునఁ గా లూఁది
కదలనేరని వెలిగా రనంగ
యాదోవిభునకుఁ దోయనిధి సేయించిన
(వెలఁది)ముత్తెపుసింహపీఠ మనఁగఁ
బాలు గ్రోలఁగఁ గోరి పాలసంద్రముమీఁద
వ్రాలు పురాణమరాళ మనఁగ
జలధి ద్రవ్వుచు సాగరులు నిల్పిన విఫేన
ఘట్టమైనట్టి పెన్నిట్ట యనఁగ
జనకుఁ డైనట్టి దనుఁ గనుఁగొనఁగఁ జేరఁ
బుత్రవాత్సల్యమున మహాంభోధి తరగ
చేతుల బిగించి కౌఁగిటఁ జేర్పఁ గదల
కున్న శశి యనఁ దెలిదీవి చెన్ను మీఱు. ౧౩

సీ. ప్రతిమాసచంద్రనిర్మితి కబ్ధి యుంచిన
కారణద్రవ్యసంఘం బనంగ

గాలివెంబడి నొకకడఁ జేరు హరిమంచ
నిర్ముక్తకంచుకనిచయ మనఁగ
నబ్జగేహాకు వాస మైనట్లు హరికి ని
వాస మైన సితాబ్జభవన మనంగ
నక్షయచంద్రుఁ డిమ్మని వారినిధి వేఁడ
వచ్చిన కైరవవార మనఁగ
నంబరంబున కెగసిన యపుడె మ్రింగు
నకట రాహుగ్రహం బన నాత్మఁ గలఁగి
జనకుఁ డగుసింధురాజు నక్కున నని యున్న
విధుని బింబం బనఁగ మించు వెల్లదీవి. ౧౪

క. నెలనెలకు జలనిధానము
కలువలచెలిమండలంబు గావించుటకై
నిలిపిన మాదిరియో యన
వెలయుం దెలిదీవి కాంతి విశదం బగుచున్. ౧౫

గీ. తనకరౌఘంబు వేఁడిమిఁ దాళలేక
శరధిఁ దేలుచు దుగ్ధపాండురిత మైన
దివసకరమండలమె తెల్లదీవి. యట్లు
గానినాఁ డంకు హరి యుండఁగాఁ బనేమి. ౧౬

క. తనగు వయఃప్రకృతిని మృగు
వని యూడ సహింపలేక యంబుధి యొకచోఁ
గనుపించెనొ కార్శ్యం
బనఁగ సితద్వీప మఘుదురాపం బమరున్. ౧౭

క. వనజదళాక్షుఁ డుదధి వా,మనమూర్తి వసింప నచటి మట్టుననే పే
రెనొ పాలసంద్ర మనఁగాఁ, గననగుఁ దెలిదీవి రుచిధగద్ధగితం బై.

గీ. నీరుపాపలు గుమిగూడి నింగి కెగయ
వీచికారజ్జువులఁ గట్టి విడిచినట్టి
కాగితపుగాలిపటము నిష్కంపలీల
నున్నదో యనఁ దెలిదీవి చెన్నుమీఱు. ౧౯

గీ. వనధులకు నెల్లఁ దారాజు గనుక పాల
కడలి పట్టించుకొను తెల్లగోడు గనంగ
నెసఁగు తెలిదీవి తనమీఁద నింద్రనీల
కల నునుఁగ శౌరి తనుశోభ గ్రమ్ముకొనఁగ.

గీ. వీల నేనుండ గొల్లలయిండ్లు సొచ్చి
వెన్న దొంగిల నీవిద్య విడువు మనుచు
వారినిధి యల్లునికి నొక వంక వైచెఁ
దిన్నగా వెన్న లనఁ దెల్లదీవి మెఱయు.

గీ. మహికి మగఱాల మొలనూలు రహివహించు
పాలకడలిని హరినీలశాలిమధ్య
మైన తెలిముత్తియపుమొగ పనఁగఁ బరఁగు
దీర్ఘధవళప్రభల తీవిఁ దెల్లదీవి.

గీ. నాకవిభునకు వెఱచి మైనాకపూర్వ
పర్వతంబులలో నుండి పైని వేగు
నిలుపుగాఁ జొప్పుమూర్ప డిండీరపిహిత
దేహ మగుకొండ యనఁ దెల్లదీవి మెఱయు.

గీ. కందుఁ గుంకును జెందు నాయింకునందు
నంచుఁ జింతించి తప మాచరించి కడలి
గన్న కందును గుందును గనని యింకు
చందమునఁ దెల్లదీవి చెన్నొందు నెపుడు.

క. అనుదినము నచ్చు బహువా
హినులఁ గలయు కడలిపాల నేర్పఱుపఁగ వ
చ్చిన వంచనాసితచ్ఛద
మనఁ దగు నాద్వీప మతిసితాభం బగుచున్.

క. తెలిదీవి కలువరారా
చలువ మురారాతి వామచక్షూరుచిఁ బో
చులఁ దోఁగఁ దొరుఁగు పాండుర
సలిలంబులె నిండి దుగ్ధసాగర మయ్యెన్. *

* దీనితరువాత "వ. అ" అనిమాత్రమే యున్నది.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు

# రజతోత్సవసంపుటము.

ఇం దిరువదియైదుసంవత్సరములలోని పరిషచ్చరిత్రము గలదు. అనేకులు పండితులు, కవులు, ప్రభువులు వ్రాసిన యాంధ్రగద్యపద్యవ్యాసములును ఇంగ్లీషువ్యాసములును గలవు. రాజులు, మహారాజులు, తదితరుల ఫొటోలును గలవు.

దీని వెల ౧-౦-౦.

పరిషచ్చరిత్రము ౦-౮-౦.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.